# ఆంధ్రపత్రిక



The Andhra Patrika - Madras సంపుటం 44. సంచిక 62 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO సోమవారం 3-6-1957 Reg. No. M. 1118 4 పేజీలు 7 నయాపైసలు

# దేశాభ్యుదయసాధనకు నెహ్రూ "ఉత్తమపురుషపద్ధతి"

## ఆహారధాన్యాలకు కనీసపు ధరల గిట్టుబాటు

## అఖిలభారత కాంగ్రెసు సంఘంలో తీర్మానం

### భూసంస్కరణలు, సహకార పద్ధతులతో సహా 18 అంశాల కార్యక్రమం

న్యూఢిల్లీ, జూన్ 2: దేశంలో ఆహారసమస్యను పరిష్కరించడానికి, ధాన్యాలకు కనీసపు గిట్టుబాటు ధరల నిర్ణయం, శీఘ్రకాలంలో భూసంస్కరణల అమలు, వ్యవసాయంలో సహకారోద్యమ వ్యాప్తి మొదలైన 18 అంశాల కార్యవిధానాన్ని సూచిస్తూ, కేంద్రకాంగ్రెసు సంఘం తరఫున ఇవాళ అఖిలభారత కాంగ్రెసు సంఘంలో ప్రతిపాదితమయింది.

దేశంలో ఆహారసామగ్రి తగినంత ఉన్నదికాని, అక్రమ లాభార్జనల కోసం కొందరు దాటునిలవలుపోసి ఉంచడంవల్లా, పంపకం సక్రమంగా జరగడంలేదని ఈ తీర్మానంలో ఒక అభిప్రాయం వ్యక్తం చేశారు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చిన్న చిన్న సర్దుబాట్లుచేసుకోవాలంటే ఫరవాలేదు కాని, ఉక్కు, బొగ్గు, విద్యుదుత్పత్తి, రవాణా అభివృద్ధివంటి ప్రధాన కార్యక్రమాలను మీసమంతైనా తగ్గించకుండా, ప్రణాళిక కాలాన్ని అయిదేళ్ళకుపైన పొడిగించకుండా, సామ్యవాద సమాజ వ్యవస్థ లక్ష్యానికి ప్రత్యవాయం లేకుండా చేయాల్సిన ...

తీసుకురావాలి.

3. గొట్టపు బావులు, చెరువులు, నూతులు మొదలైన చిన్న నీటివసతులు — ప్రణాళికలో నిర్ణయించిన ప్రకారం అధికారులవల్ల జాప్యాలు లేకుండా, నష్టం రానివ్వకుండా త్వరత్వరగా నిర్మించాలి.

4. రాష్ట్ర ప్రభుత్వాలలో వ్యవసాయ శాఖలకు తగినంత ప్రాముఖ్య ...

ఆహారసమస్యపై తీర్మానం

... కాపాడాలి, ఆహారం నష్టపడ నివ్వరాదు.

7. పండగలు, ఉత్సవాలు, పెళ్ళిళ్ల వగైరాలలో ఆహారాన్ని నష్టపరిచే పద్ధతి మానిపించాలి.

8. సమాజవికాస కార్యక్రమాలు, జాతీయవిస్తరణ కార్యక్రమాలు వ్యవసాయవృద్ధే ప్రధాన కర్తవ్యంగా నిర్వ

3 పుట చూడుడు

## నాసర్‌తో భారత రాయబారి చర్చలు

### పశ్చిమాసియా పరిస్థితుల సమీక్ష

కైరో, మే 31: ...

## కమ్యూనిస్టుల వేట

### స్వయంగా మలయా సైన్యం పూనిక

## భారత పాకిస్తాన్ కాల్వనీటి తగాదా

### వచ్చేవారం ప్రపంచబ్యాంకు ఉద్యోగుల రాక

... ప్రపంచ బ్యాంకు ఉపాధ్యక్షుడు, మరో ఇద్దరు ఉద్యోగులు వచ్చేవారం కరాచీకి, న్యూఢిల్లీకి వస్తున్నారు.

భారత ప్రభుత్వజలవిద్యుత్ శాఖ ప్రధాన కార్యదర్శి గుల్హాటి ఈ సంగతి యివాళ చెప్పారు. ఆయన వాషింగ్టన్‌లో, యీ సమస్యపై భారత ప్రతినిధి వర్గ నాయకుడుగా చర్చల్లో పాల్గొని యివాళే యిక్కడికి వచ్చారు.

## "మన తరంలోనే సామ్యవాదస్థాపన"

### కాంగ్రెస్‌కు ఆర్థికమంత్రి నినాదం: కొత్తపన్నుల సమర్థన

న్యూఢిల్లీ, జూన్ 2: ఆర్థికమంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి కాంగ్రెసుకు ఇవాళ ఒక నినాదం సూచించారు. అది: "మన తరంలోనే సామ్యవాదం."

అఖిల భారత కాంగ్రెస్ సంఘంలో శ్రీ కృష్ణమాచారి ఇవాళ తమ పన్నుల ప్రతిపాదనలను గట్టిగా సమర్థించుకున్నారు.

తాను రూపొందించిన పన్నుల వ్యవస్థ, ప్రాతిస్వీకరంగానికి కృషికి తగిన అవకాశం లోపాదం ఇస్తూనే, మన దేశాన్ని సామ్యవాద మార్గంలో నడిపించుకు పోయే లక్షణం ఉందని శ్రీ కృష్ణమాచారి చెప్పారు.

ఆర్థిక తీర్మానంపై మాట్లాడుతూ శ్రీ కృష్ణమాచారి పైవిధంగా తమ పన్నులను సమర్థించుకున్నారు.

తీర్మానాన్ని ప్రతిపాదించిన శ్రీ గుల్జారీలాల్ నందా, కేంద్రం ప్రణాళిక దురాశతో నిర్ణయించినది కాదన్నారు.

...

సక్రమ మార్గంలో పెట్టడమే కాని, అంతమొందించాలని కాదు, అని ఆర్థిక మంత్రి హామీ ఇచ్చారు.

సంపదపన్ను, ఖర్చు మొత్తాలపై పన్నులనుగురించిన విమర్శకు జవాబిస్తూ, పేరుకున్న సంపద కలకాలం కుటుంబంలోనే పారంపర్యంగా ఉండిపోకూడదని శ్రీ కృష్ణమాచారి అన్నారు. అది ఎప్పుడో కదిలిపోవలసినదే. అది గమనించినట్లయితే విమర్శకులు భీతిచెందవలసిన జేగి లేదు. వారినందరినీ వీధులోకి గెంటివేసి ముష్టి అడుక్కోమని చెప్పుతా మనుకోరాదు.

సంపద పన్నువల్ల శిల్పింప్రదార్ధ అధికారుల బెదరింపులకు ఒక్కొక్కసారి లోనుకావలసివస్తుందని శ్రీ కమలనయన బజాజ్ విమర్శించారు. "ధనికురాలైన స్త్రీ వద్దకువెళ్లి ఎన్ని నగలున్నాయని అడుగుతారు. అయితే ధనికురాలి నే అడుగుతారుకాని పూరిగుడిసెలో లేల ...

న్యూయార్క్, మే 31: రెండవ ప్రపంచయుద్ధ కాలంలో అమెరికా యిచ్చిన ఋణం తీర్మానం క్రింద 93 టన్నుల వెండి భారత ప్రభుత్వం ఇవాళ చెల్లించింది. ఈ వెండి కిమ్మతు 30 లక్షల డాలర్లు.

## 47 మైళ్ళ వేగంతో గాలివాన

### అలహాబాదులో ప్రయాణ సౌకర్యాల బంద్

అలహాబాదు, జూన్ 1: గంటకు 47 మైళ్ళ వేగంతో బయలుదేరిన గాలివానవల్ల ప్రయాణ సౌకర్యాలకు, టెలిఫోన్ విద్యుత్ సౌకర్యాలకు అంతరాయం కలిగింది. ఈ గాలివానవల్ల చెట్లు వ్రేళ్లతో సహా కూలిపోయాయి. ఈ త్రైర మధ్య రైల్వేమార్గాలపై అనేక చోట్ల ...

## హైదరాబాదులో ప్రాయోపవేశం

### గోవధ నిషేధ లక్ష్యం సాధనకు

హైదరాబాదు, జూన్ 2: ...

## ఎన్ని త్యాగాలు చేసిఅయినా ప్రజను ఉద్ధరించాలని ప్రధానమంత్రి ఉద్బోధ

### ప్రణాళిక భారాలను ముందుచెప్పక పోవడం తప్పేనని ఒప్పుకోలు

### అఖిలభారతకాంగ్రెసు సంఘంలో ఆర్థికస్థితి తీర్మానంపై చర్చ

న్యూఢిల్లీ, జూన్ 2: "భారతదేశం ఇప్పుడు ఒక సంకటస్థితిలో పడింది. సకల ప్రపంచం సంగతిగూడా అట్లానే వుంది. ఈయదార్థాన్ని ప్రజలు గ్రహించి, దీన్ని ధైర్యంతో తట్టుకొని, అందుకు అవసరమైన త్యాగాలన్నీ చెయ్యాలి" అని ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ నేడు అఖిలభారత కాంగ్రెస్ సంఘం సమావేశంలో మాట్లాడుతూ అన్నారు.

నేడు ఈ సమావేశంలో ప్లానింగు మంత్రి శ్రీ నందా ఆర్థికపరిస్థితిని గూర్చిన తీర్మానాన్ని ప్రతిపాదించారు. దీనిమీద చర్చజరిగింది. ఆ చర్చలో ఒక సందర్భంలో ప్రమేయం పెట్టుకొని ప్రధానమంత్రి ఈలా అన్నారు:

### ముందుగా చెప్పక పోవడం తప్పే

"ఈ కష్టాన్ని గురించి ప్రజలకు ముందుగా చెప్పక పోవడము, ఈ కష్టాన్ని ...

అంటూ జరక్కూడదు. అందుకు మనం నడుము బిగించాలి. లక్ష్యాన్ని చేరుకునేలోపల రూపంలో చేదును మ్రింగాలి.

### ఆహార పరిస్థితి

"ఆహారపరిస్థితి వుంది. ఈ విషయములో పెట్టుకున్న లక్ష్యాలను సాధించలేకపోయినాము. అన్ని రంగాలలోను, దెబ్బతింటాము. పారిశ్రామిక రంగం కుంతితం అయిపోతుంది. రెండు సంవత్సరాలక్రిందట, కొంచెం ఉద్రేకంలో ఉండి, ...

... ప్రణాళికలో, ఏ లక్ష్యాలను పెట్టుకున్నామో, వాటిని సాధించాలి. అందులో అక్కడో చిన్నమార్పు, ఇక్కడో చిన్నమార్పు చేయవచ్చు. అంతేగాని అసలు మూల కార్యక్రమాలను మార్చడం ...

### ప్రజలలో నాకు విశ్వాసం వుంది

### మధ్యేమార్గంలో వెన్ను చూపించడం తగదు

## ఎందుకు కొరగానిమాట

### రైతులకు విజ్ఞప్తి

(8 వ పుట చూడుడు)

## లోకమంతా ముక్తకంఠంతో చేసిన అభ్యర్థన ఆలించండి

### అణ్వస్త్ర పరీక్షలు మానాలని అగ్రరాజ్యాలకు కాంగ్రెస్ సంఘం విజ్ఞప్తి

న్యూఢిల్లీ, జూన్ 2: లోకమంతా ముక్తకంఠంతో చేస్తున్న అభ్యర్థనలు ఆలించి అణ్వస్త్రపరీక్షలను మానవలసిందని అగ్రరాజ్యాలకు విజ్ఞప్తిచేస్తూ కాంగ్రెస్ కార్యవర్గం ప్రతిపాదించిన తీర్మానాన్ని, ఇవాళ అఖిలభారత కాంగ్రెస్ సంఘం ఏకగ్రీవంగా ఆమోదించింది.

## భారతరాయబారితో రష్యాప్రధాని చర్చ

## రెండు రైళ్లు ఢీకొని 18 మంది మరణం

బొంబాయి, జూన్ 2: బొంబాయి పరిసర స్టేషన్‌లో రెండు రైళ్లు ఢీకొన్నందువల్ల 18 మంది మరణించారు. ఏభై మందికిపైగా గాయపడ్డారు.

...

### కావలెను

1957 జూలైనుండి కట్టడపు పనులలో పని చేయుటకు జనరల్ మెకానిక్సు, ఫిట్టర్లు, టర్నర్లు, వెల్డర్సు, ఎలక్ట్రిక్ పనివారలు, కేబుల్-జాయింటర్లు, కమ్మరిపనివారలు మొదలగువారు కావలెను. తగిన పనివారలకు ఖాయమైన ఉద్యోగములలోనికి తీసికొనుటకు మంచి అవకాశములు కలవు. కనీస విద్యార్హతలతోపాటు, ఎక్సుపీరియన్సు చేసిన సర్వీసు సర్టిఫికెట్లు కాపీలను దరఖాస్తులకు జతపరచి 10-6-57 లోగా జనరల్ మేనేజరు పన్యం సిమెంట్సు & మినరల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్., బేతంచర్ల పోస్టు, కర్నూలుజిల్లావారికి పంపవలెను.

### కావలెను

తూర్పుగోదావరిజిల్లా ద్రాక్షారామలోని శ్రీ పెండా వెంకన్న రామకృష్ణయ్య ఉన్నతపాఠశాలలో పనిచేయుటకు యీ దిగువ ఉపాధ్యాయులు కావలసియున్నారు. సంపూర్ణ అర్హతలుగల ఉపాధ్యాయులు తమ దరఖాస్తులను ది 15-6-1957 తేదీలోపుగా సదరు పాఠశాల కరస్పాండెంటుగార్కి పంపుకొనవలెను. దరఖాస్తుదారులు తమ దరఖాస్తు నకళ్ళను శ్రీ డి. ఇ. ఓ. గార్కి పంపవలెను.

1 సైన్సు (B. Sc. B. Ed.)
2 తెలుగుపండిట్సు(సెకండుగ్రేడు)
3 డ్రాయింగు (హయ్యరు గ్రేడు ఎస్. ఎ. ఎ.)
4 Physical Education (హయ్యరుగ్రేడు.)

నం. రామచంద్రరావు,
కరస్పాండెంటు.
ద్రాక్షారామ, ది 30-5-57.

### వాణిజ్య పరిశ్రమలశాఖ, ఆంధ్రప్రదేశ్

(i) పాటరీస్ అండ్ రిఫ్రేక్టరీస్ (ii) గాజు అండ్ ఎనామెల్ డిప్లొమా కోర్సులలో ప్రవేశమునకుగాను దరఖాస్తులు కోరబడుచున్నవి. కోర్సు జూలై 57 మొదటి వారములో నెల్లూరు జిల్లా గూడూరులోని సిరమిక్ ఇన్‌స్టిట్యూట్‌లో ప్రారంభమగును. సదరు కోర్సు మూడు సంవత్సరములలో పూర్తి అగును.

ప్రవేశమునకు కనీస అర్హతలు : కాలేజి కోర్సు చదువుటకు అర్హత కలిగిన ఎస్. ఎస్. ఎల్. సి.

వయస్సు : 15 సం॥కు పైన 21 సం॥ లోపు.

ప్రతి కోర్సునకు 15 విద్యార్థులు తీసికొనబడుదురు. నెలకు రు. 25/- స్టయిఫండు ప్రతి కోర్సులోనూ పదిమంది విద్యార్థులకీయబడును. సిరమిక్ ఫ్యాక్టరీలచే సిఫార్సు చేయబడిన అభ్యర్థులకు ప్రాముఖ్య మీయబడును.

తమ చిరునామా వ్రాసి తపాలబిళ్లలు అంటించిన కవరును పంపుచూ సిరమిక్ ఎక్స్‌పర్టు - ఇన్‌ఛార్జి, గవర్నమెంటు సిరమిక్ ఇన్‌స్టిట్యూట్, గూడూరు వారికి వ్రాసి దరఖాస్తు ఫారమును ప్రాస్పెక్టసును పొందవచ్చును. దరఖాస్తులు సిరమిక్ ఎక్స్‌పర్టు ఇన్‌ఛార్జి, గూడూరు వారికి 20-6-57 లోగా చేరవలెను.

డైరెక్టర్ ఆఫ ఇండస్ట్రీస్ & కామర్సు,
(ఆంధ్రప్రదేశ్)

### సవరణ

ఇన్‌కంటాక్సు నోటీసు U/S 22 (1)

ఎడిషనల్ ఇన్‌కంటాక్సు ఆఫీసరు, విశాఖపట్టణమువారి ప్యారిస్ డిక్షనుకు అడుగు భాగమునవున్న "(సం) సి. హెచ్. దశరథరామయ్యకు" బదులు "(సం) సి. సీతారామరాజు (ఎడిషనల్ ఛార్జి)" అని చదువుకోవలెను.

సి. సి. బ్రౌను తెలుగు - ఇంగ్లీషు డిక్షనరీ కావలెను. అమ్మకమునకైనా సరే లేదా కొన్ని రోజులు బదులు యిచ్చినా సరే. బాగ్ర లిగావాడి, పని పూర్తికాగానే పంపించివేస్తాను.

V. J. RAO, 19-B. Lakshmi Estate, Andheri-East, Bombay.

### ఆంధ్రా యూనివర్శిటీ కాలేజీలు

## నోటిఫికేషన్

ఎకడమిక్ సం॥ 1957-'58 నుండి ఈ దిగువ క్రొత్త కోర్సులు వాల్తేరు యూనివర్శిటీకాలేజీలలో ప్రారంభింపబడునని ఇందుమూలముగా తెలియపర్చడమైనది.

I బి. ఎ. (Hons)

ఆర్కియాలజీలో ఒక కోర్సు, ఇపిగ్రఫీ, న్యూమిస్‌మేటిక్సుతో కూడిన హిస్టరీ సబ్ గ్రూపు.

II M. Sc (కెమిస్ట్రీ) స్పెషల్ సబ్జక్టు ఎనలిటికల్ కెమిస్ట్రీ.

కెమిస్ట్రీ మైన్ సబ్జక్టుగా బి. యస్. I లేక II క్లాసులలో ప్యాసయిన గ్రాడ్యుయేటులకు 2 సం॥లు కెమిస్ట్రీ మైన్ సబ్జక్టు బి. యస్ సి (Hons) గ్రాడ్యుయేట్లకు ఒక సంవత్సరము.

III మాస్టర్ ఆఫ్ బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ (ఎమ్. బి. ఎ.)

ఆంధ్రా యూనివర్శిటీ నుంచి కామర్సు లేక ఎకనమిక్సు (Hons) డిగ్రీ పొందినవారికి బి.కామ్ లేక బి.ఎ; I లేక II క్లాసులలో ప్యాసయిన డిగ్రీ వారలకునూ 2 సం॥ల కోర్సు.

గమనిక:-ఆంధ్రా యూనివర్శిటీ I లేక II క్లాసులలో ఇతర సబ్జక్టులలోనైనను లేక పాస్ గ్రాడ్యుయేటును గూడా వైస్ ఛాన్సలర్ యొక్క నిర్ణయమును బట్టి సదరు గ్రాడ్యుయేట్లు తగినంత బిజినెస్ అనుభవము చూపినచో సదరు కోర్సులో చేర్చుకొనబడుదురు.

VI సోషల్ వర్కులో డిప్లమా.

ఆంధ్రా యూనివర్శిటీ నుండి ఎకనామిక్సు, హిస్టరీ, పొలిటిక్సు, సోషియాలజీ, ఫిలాసఫీ మైన్ సబ్జక్టుగా బి. ఎ లేక బి. ఎ. (Hons) లేక ఎమ్. ఎ. డిగ్రీ పరీక్షలలో ఉత్తీర్ణులయిన అభ్యర్థులకు 2 సం॥ల కోర్సు.

తమ ఎడ్రసు వ్రాసిన 10'' × 4'' కవరుతోపాటు ప్రాస్పెక్టసుకు, దరఖాస్తుఫారమునకు, ప్రిన్సిపల్, యూనివర్శిటీ కాలేజస్, వాల్తేరు వారికి (పోస్టు వ్రాయవలెను కాని పేరు వ్రాయకూడదు.) వ్రాసి తెప్పించుకొనవచ్చును. దరఖాస్తులు అందుకొనుటకు 10-6-57. చివరి తేది.

కె. రంగధామరావు,
ప్రిన్సిపాల్.

### గుంటూరు జిల్లాబోర్డు వేలము నోటీసు.

గుంటూరు జిల్లాలో కృష్ణా పుష్కర సందర్భములో తే 20-6-1957 ది మొదలు 4-7-1957 వరకు పుష్కర యాత్రాస్థలములలోనికి వచ్చు బండ్లమీదను పసువులమీదను, సుంకములు మద్రాసు పబ్లిక్ హెల్తు అక్టు, 118 సెక్షన్ క్రింద, వసూలుచేయు హక్కున్నూ, నీటిమార్గములద్వారా ప్రయాణముచేయు యాత్రికులపైని సదరు అక్టు 117 సెక్షన్ క్రింద విధించబడు పన్ను వసూలుచేయు హక్కున్నూ, ఈ దిగువ నుదహరింపబడిన స్థలములలో ఆ యా తేదీలయందు వేలము వేయబడును. పాట, పాడదలచినవారు ఆ యా స్థలములలో, ఆ యా తేదీలలో హాజరు కావలసినది.

| వరుస నెం. | పుష్కరయాత్ర స్థలము | వేలము జరుగు స్థలము | వేలముచేయు అధికారి | వేలము జరుగు తేది, గంట. |
|---|---|---|---|---|
| 1. | తాడేపల్లి | లోకలుఫండ్ రహదారి బంగాళా మంగళగిరి | జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరు గారి పర్సనల్ అసిస్టెంటు | 6-6-57 ఉదయము 11 గం॥ |
| 2. | వైకుంఠపురము | రహదారి బంగాళా అమరావతి | డిటో | 7-6-57 ఉదయము 10 గం॥ |
| 3. | అమరావతి | డిటో | డిటో | 7-6-57 మధ్యాహ్నము 2 గం॥ |
| 4. | చామ్రరు | రహదారి బంగాళా అచ్చంపేట | లైసెన్సు ఇన్‌స్పెక్టరు సత్తెనపల్లి | 6-6-57 మధ్యాహ్నము 2 గం॥ |
| 5. | పొందుగల | బోర్డుహైస్కూలు గురజాల. | డిటో | 7-6-57 మధ్యాహ్నము 2 గం॥ |
| 6. | పెదకొండూరు | బోర్డుహైస్కూలు పెదపాలెం | లైసెన్సు ఇన్‌స్పెక్టరు తెనాలి | 6-6-57 ఉదయము 10 గం॥ |
| 7. | బలుసుగోటిపురం | బోర్డుహైస్కూలు కొల్లిపర | డిస్ట్రిక్టుబోర్డు రెవెన్యూ ఆఫీసరు, గుంటూరు | 6-6-57 ఉదయము 10 గం॥ |
| 8. | చిలుమూరు | లోకల్ ఫండ్ సత్రము, కొల్లూరు | డిటో | 7-6-57 ఉదయము 10 గం॥ |
| 9. | కొల్లూరు | డిటో | డిటో | 7-6-57 మధ్యాహ్నము 2 గం॥ |
| 10. | పెనుమూడిలపాలెం | లోకల్ ఫండ్ సత్రము, పెను మూడిలపాలెం | లైసెన్సు ఇన్‌స్పెక్టరు తెనాలి | 7-6-57 మధ్యాహ్నము 2 గం॥ |
| 11. | వెల్లటూరు | పంచాయితీ సత్రము వెల్లటూరు | డిస్ట్రిక్టు బోర్డు రెవెన్యూ ఆఫీ సరు, గుంటూరు | 8-6-57 మధ్యాహ్నము 3 గం॥ |
| 12. | పెనుమూడి | లోకల్ ఫండ్ రహదారి బంగాళా రేపల్లె | లైసెన్సు ఇన్‌స్పెక్టరు తెనాలి | 8-6-57 మధ్యాహ్నము 3 గం॥ |

పూర్తి వివరములు తెలుసుకొన దలచినవారు జిల్లాబోర్డు ఆఫీసులోగాని, జిల్లాబోర్డు రెవెన్యూ ఆఫీసరుగారివల్లగాని పైన చెప్పబడిన లైసెన్సు ఇన్‌స్పెక్టర్ల వద్దనుంచిగాని కనుగొనవచ్చును.

జిల్లాబోర్డు ఆఫీసు,
గుంటూరు.
తే. 29-5-57.

Sd/- కె. నాగభూషణరావు,
స్పెషల్ ఆఫీసరు స్థానే.

# క్రీడారంగం

## గుంటూరులో టేబుల్ టెన్నిస్ పోటీలు

### జూన్ 13 నుంచి 16 వరకు

గుంటూరు, మే 30: రిక్రియేషన్ క్లబ్‌లో నూతనంగా నిర్మించిన హాలులో జూన్ 13 నుంచి 16 వరకు టేబుల్ టెన్నిస్ టోర్నమెంట్సు జరుగుతాయని కార్యదర్శి శ్రీ వి. దక్షిణామూర్తి ప్రకటిస్తున్నారు. 12 న డ్రా జరుగుతుంది. ఎంట్రీలు గౌరవ కోశాధికారి శ్రీ టి. రత్తయ్య పేర (రెండవలైను-బ్రాడీపేట) 11 లోగా చేరాలి. ఇతరగ్రామాల నుంచి వచ్చే వారికి ఉచిత భోజన సౌకర్యాలుంటాయి. (స్వ. వి.)

## బాస్కెట్‌బాల్ టూర్నమెంటు

అమలాపురం, మే 29: బోర్డుఉన్నత పాఠశాల ఆవరణలో యీనెల 25, 26, 27 తేదీలలో బాస్కెట్‌బాల్ టోర్నమెంట్సు జరిగినవి. కీ॥ శే॥ మంతె చంద్రశేఖర శర్మ స్మారకార్థం యీ పోటీలు నిర్వహించారు. శ్రీ పెద్దాడ రామచంద్రారావు వీటికి ప్రారంభం చేశారు. చివరి రోజున తుదిపోటీలు జరిగాయి. యం. సి. హెచ్. స్మారక జట్టు (అమలాపురం) గెలుపొందింది.

ఆ సాయంత్రం శ్రీ కె. రామభద్రరావు అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. శ్రీ కల్లూరి చినవెంకటరత్నం బహుమతులు పంచారు.

అధ్యక్షులు మాట్లాడుతూ ఇటువంటి పోటీల ఆవశ్యకత వివరించారు. శ్రీ డి. జోసెఫ్ నివేదిక చదివారు. తణుకు నుంచివచ్చిన ఆంధ్ర అమెచ్యూర్సు జట్టుకు ప్రత్యేకంగా ఒక వెండికప్పును బహూకరించారు.

శ్రీ పి. వేణుగోపాల్ ప్రసంగిస్తూ రాష్ట్రీ బాస్కెట్‌బాల్ ఛాంపియన్‌షిప్‌ను అమలాపురం జట్టు సాధించినందుకు హర్షం ప్రకటించారు. శ్రీ కందుకూరి సూర్యనారాయణ వందన మర్పించారు. (స్వ. వి.)

### నోటిఫికేషన్

వ్యవసాయ కళాశాల, బాపట్ల.

ఆంధ్రా యూనివర్శిటీ 1 వ సంవత్సరం బి.ఎస్‌సి., (వ్యవసాయం)విద్యార్థులకు, బాపట్ల వ్యవసాయ కళాశాల 1-7-57 న తెరువబడును.

నిర్ణీత ఫారములో దరఖాస్తులు ప్రిన్సిపాలు అగ్రికల్చరల్ కాలేజి, బాపట్ల వారికి 15-6-57 తేదికి లేక ముందుగా, చేరునట్లుగ పంపగోరడమైనది.

ప్రిన్సిపాల్, అగ్రికల్చర్ కాలేజి, బాపట్లవారికి 0.75 న. పై. చెల్లించి దరఖాస్తుఫారములు ప్రాస్పెక్టసు పొందవచ్చును.

డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్,
ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్-దక్కన్

### ఆంధ్రా టెక్నికల్ కాలేజ్

రామాటాకీస్ ఎదుట - గాంధీనగరం
విజయవాడ - 2.

ఓవర్‌సీర్, మరియు డ్రాఫ్ట్సుమన్‌లకు కావలసిన, సివిల్ ఇంజనీరింగులో ఆంధ్రా, మద్రాసు ప్రభుత్వముల టెక్నికల్ పరీక్షలకు కూర్చు నేవారి నుండి దరఖాస్తులు కోరబడుచున్నవి. 25-6-1957 వ తేదీన తెరువబడును. వివరములకు, ప్రిన్సిపాల్ గారికి వ్రాయుము.

### పాలకొల్లు మునిసిపాలిటీ

## నోటిఫికేషన్

ఈ దిగువ సంతకము చేసినవారికి 15-6-57 లోగా చేరునట్లు పూర్తిఅర్హత పొందిన అభ్యర్థులనుండి సెకండరీ పాఠశాలలలోని ఈ దిగువ ఉద్యోగములకు దరఖాస్తులు కోరబడుచున్నవి. మ్యునిసిపల్ ట్రెజరీలు రు. 1/- చెల్లించి మునిసిపల్ ఆఫీసులో నిర్ణీత దరఖాస్తు ఫారమును తీసికొని దరఖాస్తులు పంపవలెను. సదరు కాపీలను జిల్లా విద్యాధికారి పశ్చిమ గోదావరి, ఏలూరు వారికి గాని లేక ఇన్‌స్పెక్ట్రెస్, గరల్సు స్కూల్సు, I సర్కిల్, రాజమండ్రి వారికి గాని సందర్భాన్ని బట్టి పంపవలెను. లోకల్ బాడీలకు వర్తించే రూల్సు ప్రకారము జీత భత్యములు ఇవ్వబడును.

1. నిర్ణయింపబడిన ఎకౌంట్సు పరీక్ష అర్హత కలిగి 10 సం॥లకు తక్కువ కాకుండ అనుభవము గలిగిన ఎల్. టి., లేక బి. టి., మ్యునిసిపల్ గరల్సు హైస్కూలుకు హెడ్‌మిస్ట్రెస్‌గా నిర్ణయింపబడుటకు,
2. లెక్కల బి. ఇడి., బి.టి., లేక ఎల్. టి.,...1 (పురుషుడు)
3. లెక్కల బి.ఇడి., బి.టి., లేక ఎల్.టి.,...1 (స్త్రీ)
4. ఫిజికల్ ట్రైనింగు ఇన్‌స్ట్రక్టరస్ (బై. ఎమ్. సి. ఎ. ట్రైనింగు పొందినవారు) ... 1
5. డ్రిల్లు, డ్రాయింగు చెప్పగలిగిన ఉపాధ్యాయుడు ... 1 (పురుషుడు)
6. తెలుగు పండితులు, గ్రేడ్ II (పురుషులు)
7. తెలుగు పండితులు, గ్రేడ్ I, II (స్త్రీలు)
8. క్రాఫ్టు ఉపాధ్యాయుడు...1.
9. సెకండరీ గ్రేడు, హయ్యర్ గ్రేడు ట్రైనింగు పొందిన ఉపాధ్యాయులు. (నిమ్నజాతులు, వెనుకబడినవర్గముల అభ్యర్థులు మాత్రమే దరఖాస్తు చేయవలెను.)

(సం) పి. సి. లింగం,
27-5-57, కమిషనర్.

# మద్రాసు హైకోర్టు సంప్రదాయాలు

## అనుకరణకు ఆంధ్ర హైకోర్టు కృషి

కోయంబత్తూరు, మే 31: ఆంధ్ర ప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బరావు నేడిక్కడ మాట్లాడుతూ మద్రాసు హైకోర్టు స్థాపించిన ఉన్నత సంప్రదాయాలు ఆచారాల అడుగుజాడలను అనుసరించటానికి తాను సర్వదా ప్రయత్నిస్తామని అన్నారు.

కోయంబత్తూరు న్యాయవాదసంఘం వారు ఆయన గౌరవార్థం యిచ్చిన విందు సందర్భమున శ్రీ సుబ్బారావు మాట్లాడుతూ పై విధంగా చెప్పారు.

న్యాయవాద సంఘాధ్యక్షుడు శ్రీ టి. టి. ఆర్. పిళ్ళె ఆంధ్రులనుగాని మరి ఎవరినేగాని విభజన కావాలని తమిళులు ఎప్పుడూ కోరలేదని తిరిగి అందరూ ఏకమైతే తమకేటి ఆక్షేపణ ఉండదని అన్నారు. విభజన జరగాల్సిన పరిస్థితుల వల్ల యీ ఎడబాటు జరిగినందున ఎవరూ ఆపరిస్థితులను అడ్డలేకపోయారని ఆయన చెప్పారు.

శ్రీ సుబ్బారావు తాను అప్పుడు మద్రాసుహైకోర్టు విభజనకు ప్రత్యేకాధికారిగా ఉండి 1954 జేసవిలో 300 న్యాయవాదులతో గుంటూరులో క్రొత్త హైకోర్టును స్థాపించుకోటానికి ఐక్యమం జరిగిందనీ ఏమాత్రం వసతులు లేకపోయినా వాలుగు నెలల్లో ఆంధ్ర న్యాయవాదుల సహకారంవల్ల క్రొత్త ఆంధ్ర హైకోర్టు వరకు కుదుటపడిందని అన్నారు. తరువాత మళ్ళీ 1956లో ఆంధ్ర హైకోర్టు ఆంధ్రప్రదేశ్ హైకోర్టుగా మారి క్రొత్త ప్రాంతాలు దాని క్రిందికి వచ్చాయని వారు చెప్పారు. తను ఉద్యోగం నుంచి విరమించేనాటికి ఆంధ్రప్రదేశ్ హైకోర్టుకు మద్రాసు హైకోర్టుకు ప్రస్తుతం ఉన్న పేరు ప్రతిష్ఠలుఅయినా ఉంటేట్లు చూడగలిగితే తాను సంతృప్తి చెందగలమని శ్రీ సుబ్బరావు అన్నారు.

## రేడియో యంత్రాగారానికి ప్రారంభోత్సవం

కోయంబత్తూరు, మే 31: ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు యిక్కడ ప్రముఖ పారిశ్రామికుడు శ్రీ జి. డి. నాయుడు స్థాపించిన రేడియో నిర్మాణ యంత్రాగారం ప్రారంభోత్సవాన్ని యీవాళ ఉదయం జరిపారు.

రేడియోలను చౌకగా వంద రూపాయలకు అమ్మటానికి వీలుగా తయారుచేయుటకు యీకర్మాగారం ఉద్దేశించబడి ఉన్నది.

శ్రీ జి. డి. నాయుడు మాట్లాడుతూ యిదివరకే 5000 రేడియోసెట్లుతయారై అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయనీ స్థానికంగా తయారుచేయ లేని వాల్వులు యింకా ఒకటి రెండు భాగాలు విదేశాలనుంచి దిగుమతి అవుతున్నాయనీ చెప్పారు. ఈ కొన్ని భాగాలు పూర్తిగా యిక్కడే తయారు అవుతున్నాయని శ్రీ నాయుడు అన్నారు.

శ్రీ సుబ్బరావు రేడియో పరిశ్రమను యిలోధికంగా ప్రోత్సహించడం చాలా అవశ్యమని అన్నారు. రేడియో విద్యా వ్యాప్తికి మంచిసాధనమే గాక రాజకీయవాది నుంచి పిల్లలదాకా అందరికీ అది ఉపయోగ పడుతుందని ఆయన అన్నారు. ప్రపంచమున అన్ని ప్రాంతాలలోని ప్రజలు రేడియోల ద్వారా మనయింట్లో మనసన్నిధిని రాగల్గుతారు. అట్టివసతి ప్రతివారికీ అందుబాటులో ఉంటానికి దేశంలో చౌక రేడియోలు విరివిగా తయారు కావడం చాలా ముఖ్యమని శ్రీ సుబ్బరావు అన్నారు.

మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి శ్రీ యస్. సోమసుందరం యీ సభకు అధ్యక్షత వహించారు.

## వరంగల్లుజిల్లా వెనుకపడిన తరగతులు

### కేంద్ర సంఘం ఏర్పాటు

వరంగల్లు, మే 29 : వరంగల్లు జిల్లాలోని వెనుకబడిన తరగతుల సంఘాలకు చెందిన ప్రతినిధులు నిన్న యిక్కడ సమావేశమై వరంగల్లు జిల్లా వెనుకబడిన తరగతుల కేంద్ర సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఈ క్రింది కార్యవర్గం ఎన్నికయినారు.

అధ్యక్షుడు-శ్రీ బొలుకొండ రంగనాయకులు, ఉపాధ్యక్షులు-శ్రీయుతులు జి. రాజలింగం, నల్లపు పిచ్చయ్య గారలు. కార్యదర్శి-శ్రీతెల్లె బుచ్చయ్య సహాయ కార్యదర్శులు - శ్రీయుతులు బి. పర్శిదేవ్, మాదన యాదగిరి గారలు కోశాధికారి - డాక్టరు బి. వీరభద్రరావు కార్యవర్గం-శ్రీయుతులు సింగారం మల్లేశం, బి. ఎస్. చారి, చాడవరపు విశ్వనాథం, రాజేశ్వరరావు,జి.వరసయ్య శ్రీమతి కనక రత్నమ్మగారలు.

## విద్యార్థి నిర్దోషి అని తీర్పు

హైదరాబాదు, మే 31 : అక్బర్ అలీఖాన్ అనేవిద్యార్థి నిర్దోషి అని నిర్ణయించి, అతనిని వదలిపెట్టవలసినదిగా నగర ప్రథమశ్రేణి మేజిస్ట్రేట్ శ్రీ నవరతన్‌లాల్ ఆదేశించారు. పాఠశాలలకు వెళ్తున్న విద్యార్థినులను ఈ విద్యార్థి ఇబ్బందిపెట్టాడని కిందటి ఫిబ్రవరిలో నేరారోపణ జరిగింది. విద్యార్థి నేరంచేసినట్లు సాక్ష్యంవల్ల బుజువు కాలేదని మేజిస్ట్రేట్ నిర్ణయించారు. విద్యార్థిని వదలిపెట్టవలసినదిగా ఆదేశించారు.

# అధికోత్పత్తికి రైతుకు ఉద్దీపనం ఇచ్చేందుకు త్వరలోనే చర్యలు

## రాజ్యసభలో ఆహారమంత్రి ప్రకటన

### వర్తకుల బాధ్యతలేని ప్రవృత్తిని అరికట్టడానికి ప్రభుత్వం నిర్ణయం

న్యూఢిల్లీ, జూన్ 1: రైతుకు పంట పండించేందుకు తగిన ఉత్సాహోద్దీపనాలను కల్పించే చర్యలను కొన్నింటిని తాను త్వరలో ప్రకటన చేయబోతున్నట్లు ఆహారమంత్రి శ్రీఅజిత్ ప్రసాద్ జైన్ నేడు రాజ్యసభలో వెల్లడిచేశారు.

దేశంలో ఆహార ధాన్యోత్పత్తి అధికమైతేనేగాని, ఆహార సమస్య పరిష్కారం కాదని గూడా ఆయన చెప్పారు.

### అవసరవస్తు (సవరణ) బిల్లుకురాజ్యసభఆమోదం

రాజ్యసభ నేడు అవసరవస్తు (సవరణ) బిల్లును ఆమోదించింది. ఇందులో జరిగిన చర్చకు సమాధానం ఇస్తూ వర్తకులను ఇబ్బంది పెట్టాలనిగాని, వర్తకాన్ని పాడు చేద్దామనిగాని, ఈ బిల్లును తాను తీసుకురావడం లేదని శ్రీ జైన్ చెప్పారు. అయితే ఇప్పుడు వర్తకులు బాధ్యతారహితంగా వ్యవహరిస్తున్నారు. వారి ఆటలను కట్టించవలసిన సమయం ఇప్పుడు ఆసన్నమైంది అని గూడా ఆయన చెప్పారు.

### సభ్యుల కొన్ని సూచనలు

ఈ బిల్లును ఆమోదించిన అనంతరం సభ వాయిదా పడిపోయింది. ఇవ్వాళ్ళ ఒక్క గంటలో పని ముగించుకుపోదామనుకొని కాంగ్రెసు వారు సభకు వచ్చారు. సభాధ్యక్షుడు డా॥ రాధాకృష్ణన్ గూడా సభ వారికి అట్లా అని విజ్ఞప్తి చేశారు. కాని సభ అనుకున్నట్లు జరగలేదు. 5 గంటల సేపు సాగింది. ఈ 5 గంటల చర్చలో సుదాసాపు 15 మంది సభ్యులు పాల్గొన్నారు. ధరలను తగ్గించడానికి ప్రభుత్వం చేస్తున్న మందకొడి కృషిని విమర్శించారు. ఒక సభ్యుడు, ఆహారమంత్రిని, శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి మార్గాన్ని అనుసరించి, రాజీనామా ఇచ్చి పోవలసిందని కోరాడు. పండిత పంత్‌జీ, ప్రభుత్వం ఇప్పుడు చేస్తున్న ఈ పనిని, ఇంకా కొంచెం ముందుగా ఎందుకు చేయలేక పోయింది అని ప్రశించారు. ఒక రాష్ట్రం నుంచి ఇంకో రాష్ట్రానికి ధాన్యం పోకుండా అరికడితేనేగాని, ధరలను అదుపులోకి తీసుకురావడంపడదని శ్రీ పైడా సూర్య నారాయణ అన్నారు.

### శ్రీ జైన్ సమాధానం

చర్చకు సమాధానం ఇస్తూ శ్రీ జైన్ ఈలా అన్నారు. ఈ బిల్లుతో ఆహార సమస్య సంపూర్ణంగా పరిష్కారం అవుతుందని నేను అనడంలేదు. అదీగాక ఒక్క దొంగ నిల్వల కారణంగానే ధరలు పెరిగాయనడం గూడా భావ్యం కాదు. అందుకు అనేక కారణాలు వున్నాయి. దేశం ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందుతూ వున్నప్పుడు, ధరలు ఎప్పుడూ పెరుగుతూనే వుంటాయి. దీనికి ఈతిబాధలుగూడా తోడైనాయి. అయితే దేశంలో వర్తకులు దొంగ నిల్వలుపోసి ధరలను మరీ అధికం చేస్తున్నమాట నిజం. అందుకే వీరి ఆటలు సాగకుండా చూడవలసి వుంది. అందు కోసం వ్యాపారపు పైస్థాయిలలో కొన్ని కంట్రోళ్ళు అమలు పరచబడలచుకున్నాను. "ఆహార సమస్య జాతీయ సమస్య, దీన్ని పరిష్కరించడంలో అన్ని పార్టీల సహకారం మాకు కావాలి. అందుకు విజ్ఞప్తి చేస్తున్నాను."

### ఒక చిన్న తగాదా

ఈ చర్చలో సభ్యులు మంత్రులు, ఆహారసమస్యను గూర్చి ఒకరు చేసిన ప్రకటనలను ఒకరు ఖండించుకోవడం ఒక విశేషంగా రూపొందింది. మంత్రులు ఫలానామాట అన్నట్లు సభ్యులు అనడం, అట్లా తాము అనలేదని మంత్రులు ఖండించడం, ఇట్లా కొంతచర్చ సాగింది. ముఖ్యంగా కేరళరాష్ట్రం ఆహారస్థితిని గూర్చి ఉప ఆహారమంత్రి శ్రీ కృష్ణప్ప, హైదరాబాదులో అన్న మాటలను, కేరళ నుంచి వచ్చిన కమ్యూనిస్టు సభ్యుడు శ్రీ శేఖర్ ఖండించారు. అప్పుడు శ్రీ కృష్ణప్ప లేచి, ఆమాటలు తాను, కేరళ ఆహార మంత్రి శ్రీ థామస్ అట్లా అన్న తర్వాతనే అన్నానని, జవాబుచెప్పారు. శ్రీ కృష్ణప్ప హైదరాబాదుఉపన్యాసానికి ముందు 15 రోజుల క్రిందట శ్రీ థామస్, కేరళ ఆహారపరిస్థితి చాలా సంతృప్తికరంగావున్నదన్నారు. ఈవిషయాన్ని ఆహార మంత్రి శ్రీ జైన్ సభవారికి తెలియచేసి, శ్రీ కృష్ణప్ప, శ్రీ థామస్ కొంచెం కంఠం తగ్గించి మాట్లాడాలన్నారు. "అన్ని రాష్ట్రాలలోను సహకరించి పనిచెయ్యాలి మేము లక్ష్యం. ఒకరాష్ట్రంలో ఎవరు అధికారంలో వున్నారన్నది మాకు విషయం కాదు" అని శ్రీ జైన్ అన్నారు.

## రాష్ట్రంలో ఖనిజ పరిశ్రమ అభివృద్ధి

### మంత్రి అధ్యక్షుడుగా సలహా సంఘం ఏర్పాటు

హైదరాబాదు, జూన్ 1: రాష్ట్రంలో ఖనిజపరిశ్రమను యేవిధంగా అభివృద్ధిచేయాలి, ఉత్పత్తిఅయినఖనిజాన్ని యేవిధంగా ఉపయోగించుకోవాలి, విక్రయించాలి; యిత్యాది విషయాలపై ప్రభుత్వానికి సలహా యిచ్చేందుకు పరిశ్రమల మంత్రి అధ్యక్షులుగా, ప్రభుత్వం సలహా సంఘాన్ని యేర్పాటు చేసింది.

గనులు ఉన్న ప్రాంతంలో రాకపోకలు రవాణా సదుపాయాలు, కార్మిక సంక్షేమ కార్యక్రమాలను సంఘటితంచేయడం. గనులనిర్వహణకుసంబంధించిన చట్టాలు, నిబంధనలు యేలా వర్తిస్తున్నదీ పరిశీలించిఈ సంఘం తగుసలహాలిస్తుంది.

ఈ సంఘంలో యీ దిగువవారు సభ్యులుగా వుంటారు.

అధికార సభ్యులు: పరిశ్రమల శాఖ మంత్రి (అధ్యక్షుడు) గనులు, భూగర్భ పరిశోధన శాఖ డైరెక్టరు; పరిశ్రమలు, వాణిజ్యశాఖ డైరెక్టరు; ఆంధ్ర మండలంలో భూగర్భపరిశోధన జరిపే భారత ప్రభుత్వ భూగర్భశాఖకు చెందిన సూపరింటెండింగ్ జియాలజిస్ట్ గాని ఆయన ప్రతినిధిగాని, రహదార్ల చీఫ్ ఇంజనీరు.

అనధికార సభ్యులు : శ్రీయుతులు బి. రామచంద్రా రెడ్డి, (మద్రాసు మైకా సంఘాధ్యక్షుడు, గూడూరు) సింగరేణి కాలరీస్ కంపెనీ మేనేజరు; ఆంధ్ర విశ్వవిద్యాలయ భూగర్భశాస్త్ర ప్రధానాధ్యాపకుడు, సౌత్ ఇండియన్ జనరల్ అసోసియేషన్ అధ్యక్షుడు శ్రీ జె.వి. సోమయాజులు (మద్రాసు)

ఈ సంఘంలో అనధికార సభ్యుల సభ్యత్వం గడువు, సంఘం యేర్పడిన లగాయతూ, మూడేళ్ళు. గనులు, ఖనిజాలు వీటికి సంబంధించిన ప్రత్యేకాధికారి, సంఘకార్యదర్శిగా ఉంటారు.

# కాంగ్రెస్‌వారు చెప్పి చెయ్యని పనులనే మేము చేస్తున్నాము

## కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వ విధానాలను వివరిస్తూ ముఖ్యమంత్రి నంబూద్రి ప్రసంగం

బొంబాయి, జూన్ 1: కాంగ్రెసువారుచెప్పి, అమలు జరపకుండా వూరుకుంటున్న అన్ని కార్యక్రమాలను తాము కేరళంలో అమలుజరుపుతున్నామని, అందువల్ల తాము ఏమో క్రొత్తపనిచేస్తున్నామన్న భావం దేశానికి అనవసరం అని కేరళ ముఖ్యమంత్రి శ్రీ నంబూద్రి పాద్ నేడు ఇచ్చట విశదం చేశారు.

### అందరి అండ అవసరం

బొంబాయి కమ్యూనిస్టు పార్టీ అధ్వర్యంలో నేడు శివాజీ పార్కులో జరిగిన బహిరంగ సభలో శ్రీ నంబూద్రి పాద్ మాట్లాడారు. దేశంలో అందరిని అన్ని పార్టీలవారిని, కేరళలో నిజమైన ప్రజాస్వామ్యాన్ని స్థాపించడంలో తమకు సహాయం చెయ్యవలసిందని కోరారు. "అంతో మా విధానాలను విమర్శించవచ్చు. మంచి సలహాలు ఇవ్వవచ్చు. ఆసూచనలను బట్టి అవసరమైతే మావిధానాలను మేము మార్చుకోనూవచ్చు" అని శ్రీ నంబూద్రి సభవారికి చెప్పుచున్నారు.

### కృష్ణమాచారి పన్నులు

కేరళ ముఖ్యమంత్రి ఈ సందర్భంలో శ్రీ కృష్ణమాచారి క్రొత్తపన్నులనుగూర్చి గూడా మాట్లాడారు. "ఈ పన్నుల ప్రతిపాదనలలో ఒక్కటే లోపంవుంది. వీటిల్లో ఎక్కడా ప్రభుత్వం దుబారానుగూర్చిన ప్రసక్తి లేదు. ఆ దుబారాను తగ్గించుకుంటామని కాదు. నా దుబారాను తగ్గించుకుంటామని చెప్పివున్నా, మంత్రుల జీతాలు, రాష్ట్రపతి జీతము తగ్గిస్తూ ప్రకటన చేసినా. ప్రజలు ఇన్ని పన్నులను తేలిగ్గా భరిస్తామనేవాళ్లు" అన్నారు.

### రాజ్యాంగం అడ్డం

కమ్యూనిస్టుల కార్యక్రమ విధానాన్ని గూర్చి మాట్లాడుతూ, అందులోని అనేక అంశాలను అమలు పరచాలంటే రాజ్యాంగం అడ్డువస్తున్నదని ఆయన చెప్పారు.

### త్యాగరాజ ఆరాధన

ఉత్సవాల వాయిదా

కాళహస్తి, జూన్ 1: కాళహస్తిలో మే 25 నుంచి 27 వరకూ జరగవలసిన త్యాగరాజ ఆరాధనోత్సవాలు అనివార్య కారణాలవల్ల వాయిదా పడినవని త్యాగరాజ భక్తసభ కార్యదర్శి తెలియచేస్తున్నారు. ఈ నెల 2 వ తేది నుంచి ఈఉత్సవాలు మూడురోజులు జరుగునవని తెలియచేస్తున్నారు.

### మద్రాసురాష్ట్రం జమయత్ ఉల్ ఉలేమా హింద్

మద్రాసు, జూన్ 1: పై సంఘం కార్యవర్గంవారు మొన్న సాయంత్రం సమావేశమై భారతదేశ ప్రముఖ నాయకులలో ఒకరైన శ్రీ టి. ప్రకాశం పంతులు విఖ్యాత దేశభక్తుడు శ్రీ కుమారస్వామి రాజా, మసూర నివాసి హాజీ మహమ్మద్ మాలానా సాహేబు మరణములకు సంతాపం వెలిబుచ్చుతూ తీర్మానం గావించారు.

మద్రాసు మంత్రివర్గంలో ఒక ముస్లిమునకు స్థానం యివ్వాలనీ, వీదలపై భారంగావుండే పన్నులను కేంద్ర ప్రభుత్వం రద్దు చేయాలని కూడా కోరుతూ తీర్మానాలు చేశారు.

## బాక్సింగ్ ఛాంపియన్ జానీ కిల్బేన్ మృతి

క్లీవ్‌లాండ్, జూన్ 1: 1912 నుంచి 1923 వరకు ప్రపంచంలో బాక్సింగ్ పోటీలలో అడ్డులేకుండా ప్రథమస్థానం అలంకరించిన ఛాంపియన్ శ్రీ జానీ కిల్బేన్ నిన్న కాన్సర్ వ్యాధితో మరణించాడు. ఈయన వయస్సు 68.1923 లో ఒక ఫ్రెంచి ఆటగాని చేతిలో ఓడిపోయిన తరువాత యీ రంగంనుంచి విరమించుకున్నాడు.

## గోవధ నిషేధం బిల్లుపై సత్వరచర్య

### హైదరాబాదు పాలక సంఘ విజ్ఞప్తి

హైదరాబాదు, మే 31: గోవధ నిషేధం బిల్లుపై సత్వరం యేదో ఒక నిర్ణయాన్ని తీసుకోవలసిందని ఆంధ్రప్రదేశ్ శాసనసభను అభ్యర్థిస్తూ హైదరాబాదు పురపాలక సంఘం నిన్న ప్రత్యేక సమావేశంలో తీర్మానం చేసింది.

ఈ తీర్మానానికి అనుకూలంగా 51 ఓట్లు, ప్రతికూలంగా 11 ఓట్లు వచ్చాయి. ఐక్య పౌరసంఘానికి (యునైటెడ్ సిటిజన్సు కమిటీ) చెందిన 9 మంది సభ్యులు ఓటింగులో పాల్గొనలేదు.

ఈప్రత్యేక సమావేశానికి, మేయర్ శ్రీ బి. కిషన్‌లాల్ అధ్యక్షత వహించారు.

పురపాలకసంఘం నగర పరిమితుల్లో గోహత్య నిషేధించాలని, 17 గురు సభ్యులు కోరిన కోర్కెపై ఈప్రత్యేక సమావేశం ఏర్పాటు చేయడమైంది.

ప్రస్తుత పురపాలకసంఘాలచట్టాన్ని సవరించి, గోవధ నిషేధించడానికి, పురపాలకసంఘాలకు అధికారం లేదనీ, కాంగ్రెసుపక్షనాయకులుశ్రీమబ్బూబ్ అహమ్మద్ జమాయ్ వివరించారు. గోవధ నిషేధం బిల్లుపై సత్వరం నిర్ణయము తీసుకోవలసినదిగా శాసనసభను అభ్యర్థిస్తూ ఆయన ఒక సవరణ ప్రతిపాదించారు. పాడిపశువులను చంపకుండా ఉత్తర్వులు జారీచేయవచ్చుననీ, ఈసమస్యపై మతవిషయ ప్రసక్తి తీసుకునిరావడం తప్పు అని శ్రీ జమాయ్ అన్నారు.

శ్రీ జమాయ్ ప్రతిపాదించిన సవరణను శ్రీ రామారావుదోరే బలపర్చారు. శ్రీయుతులు నరసింహాచార్యులు, జగజీవనరాం, యాదయ్య ప్రభృతులు ప్రసంగించారు.

ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశంపంతులు గారి మృతి సంతాపాన్ని వెలిబుచ్చుతూ శ్రీ ఎర్రం సత్యనారాయణ ప్రతిపాదించిన తీర్మానమును ఏకగ్రీవంగా సభలో ఆమోదించారు. సభ్యులు రెండు నిముషాలు నిశ్శబ్దముగా నిలబడి శ్రద్ధాంజలి ఘటించారు.

# ఆకాశవాణి

మంగళవారం, జూన్ 4

#### హైదరాబాద్

(411 మీటర్లు) (730 కిలో సై)

ఉ॥ 6-50 సుప్రభాత్ 7-0 తె. వా. 7-15 నాదస్వరం: షేక్ హుస్సేన్ సాహెబ్ (విజయవాడ నుంచి రిలే) 7-45 క. వా. 8-0 ఆం. వా. 8-15 హిం. వా. 8-30 తబ్లా 8-45 గీతావళి.

మ॥ 12-30 మిశ్రమాధురి 12-50 ఉ. వా. 1-0 మహిళాసమాజం 1-30 వాద్యసంగీతం 1-50 తె. వా.

సా॥ 5-30 గీత్ 5-45 హిందూస్థానీ సంగీతపాఠం 6-0 స్థానిక ప్రకటనలు 6.5 ప్రాంతీయ వా. 6-15 వాద్యగోష్ఠి 6-30 గ్రామసీమ 7-0 తె. వా. 7-15 గ్రామసీమ 7-30 హిందీ ప్రసంగం 7-45 శ్రోతల ఉత్తరాలకు జవాబులు (హిందీ, ఉర్దూ) 7-50 గీతావళి 8-0 ఖయాల్ 8-30 జె. నటరాజన్ 9-0 ఆం. వా. 9-15 ఉ. వా. 9-30 హిందీ నాటిక 10-0 ఖయాల్ 10-30 ప్రసార సమాప్తి.

#### విజయవాడ

(357.1 మీటర్లు) (140 కిలో సై.)

ఉ॥ 6-30 శుభోదయం, 6-35 ప్రసార విశేషాలు, 6-40 భక్తిరంజని, 7. తె. వా., 7-15 నాదస్వరం : షేక్ హుస్సేన్ సాహెబ్, 7-45 సంగీత శిక్షణ, 8. ఆం. వా., 8-15 హిం. వా.

మ॥ 1. మహిళా సమాజం (హైదరాబాదు నుంచి రిలే), 1-30 గానసుధ, 1-40 హిం. వా., 1-50 తె. వా., 2. సితార్, 2-15 సారంగి.

సా॥ 5-30 నాదస్వరం : షేక్ హుస్సేన్‌సాహెబ్, 6. స్థానికప్రకటనలు, 6-05 ప్రాంతీయవార్తలు, 6-15 గ్రామస్థుల కార్యక్రమం, 7 తె. వా. 7-15 గ్రా. కా 7-30 వీణ వి. కృష్ణమూర్తి, 9. ఆం. వా., 9-15 సాహిత్యసంచిక, 9-30 ఆకాశవాణి వాద్యబృందం, 10. ఎం. గోపాలకృష్ణమూర్తి, 10-30 ప్రసార సమాప్తి.

#### మద్రాస్ (ఎ)

(319.1 మీటర్లు)

ఉ॥ 6-50 స్వాగతం, 6-55 కార్యక్రమవివరణ, 7. వాద్యసమ్మేళనం, 7-15 త. వా, 7-30 జి. పి. ఎస్. కృష్ణమూర్తి.

మ॥ 12-30 ఎస్. శంకరన్, 1. మహిళాసమాజం(హైదరాబాదునుంచి రిలే), 1-30 గీతమంజరి, 1-40 హిం. వా., 1-50 గీతమాలిక, 2 త. వా., 2-10 వీణ: ఎ. సుబ్రహ్మణ్యం, 2-40 సారంగి, 2 50 సి. ఎస్. రాజలక్ష్మి.

సా॥ 5. పాశ్చాత్య సంగీతం, 5-30 వయొలిన్: కె.ఎస్. రామసుబ్రహ్మణ్యం, 6-05 ప్రాంతీయ వార్తలు, 6-15 జి. పి. ఎస్. కృష్ణమూర్తి, 6-45 తిరువారూర్ ఎస్. కాంతిమతి, 7-15 త. వా., 7-30 గానలహరి, 7-45 క్లారినెట్: ఎ. కె. సి. నటరాజన్ (తిరుచ్చినుంచి రిలే), 9. సుగమ్ సంగీత్, 9-15 హిందీ ప్రసంగం (తిరుచ్చినుంచి రిలే), 9-30 ఆకాశవాణి వాద్య బృందం (విజయవాడ నుంచి రిలే) 10 గానమాలిక, 10-30 ప్రసార సమాప్తి.

#### మద్రాస్ (బి)

(211.8 41.42 మీటర్లు)

ఉ॥ 6-50 ఏవలె 7 తె. వా. 7-15 ఉదయగానం 7-30 ఏ వలె 8 ఆం. వా. 211.8, (31.28 మీటర్లు)

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 ఎ వలె 1 గీతమాలిక 1-30 ఆం. వా. 1-40 గీతమంజరి 1-50 తె. వా. 2 సుగమ్ సంగీత్ 2-10 ఎ వలె.

సా॥ 5 ఎవలె 5-50 స్థానిక ప్రకటనలు, 6 ఆంగ్ల వా. 6-05 ప్రాంతీయ వార్తలు 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7. తె. వా. 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 తమిళ ప్రసంగం (తిరుచ్చినుంచి రిలే) 7-45 ఎ వలె 9 ఆంగ్ల వా. 9-15 తమిళ నాటిక 9-30 సుగమ్ సంగీత్ (తిరుచ్చినుంచి రిలే) 10 ఎ వలె 10-30 ప్రసార సమాప్తి.

## రామకృష్ణా వైద్య శిక్షణ కళాశాల

### క్రొత్తకార్యవర్గం ఎన్నిక

హైదరాబాదు, మే 31 : హైదరాబాదులోని శ్రీ రామకృష్ణా వైద్య శిక్షణా కళాశాలకు ఈ క్రింది పాలకవర్గం ఎన్నికయినారు: అధ్యక్షురాలు. శ్రీమతి జి. విజయలక్ష్మి, ఉపాధ్యక్షుడు-శ్రీ ఎ. నారాయణరెడ్డి, కార్యదర్శి-శ్రీ ఎస్. హనుమంతరావు సహాయకార్యదర్శిని-శ్రీమతి కె. వాణీకుమారి. కార్యవర్గ సభ్యులు-శ్రీయుతులు డి. హనుమంతరావు, వెంకటాచలం, ఎస్. వి. ఎల్. నరసింహారావు పి. ఎన్. మూర్తి, కె. లక్ష్మీనారాయణ హెచ్. లక్ష్మీనారాయణ, ఎస్. ఎస్ భాగ్యం, శ్రీమతి జయసరోజనీదేవి.

## గుంటూరు తాలూకా గ్రంథాలయ సంఘం

గుంటూరు, మే 28 : గుంటూరు తాలూకా గ్రంథాలయ సంఘ సమావేశం ఈ నెల 26 న శ్రీ కె.వి. పున్నారావు అధ్యక్షతన జరిగింది. శ్రీయుతులు త్రిపురమల్లు లక్ష్మయ్య గుప్త, అవరాజు దక్షిణామూర్తి,చుండూరి అప్పారావు గారలు సమావేశానికి వచ్చారు. ప్రకాశంపంతులుగారిమృతికి సంతాపం తెలియజేశారు. సంఘ నిబంధనావళిని తయారుచేసి సమాదు చేయించేందుకు శ్రీయుతులు అప్పరాజు దక్షిణామూర్తి, కె. వి. పున్నారావు, త్రిపురనేని వెంకటేశ్వరరావు గారలతో ఉపసంఘాన్ని ఏర్పాటు చేశారు.

# దేశాభివృద్ధికి కృషిచేయాలనే భావం కాంగ్రెసువారికికలగడం అనుమానమే

## క్రమశిక్షణ లేక సంస్థ పునాది కదిలిపోయిందని నెహ్రూసంతాపం

న్యూఢిల్లీ, జూన్ 1: "కాంగ్రెసు వాదులలో క్రమశిక్షణ నశించింది. ఒక సంస్థ మనుగడ ఆ సంస్థ సభ్యుల క్రమశిక్షణపై ఆధారపడిఉంది. నేడు మనం సామ్యవాద సమాజాన్ని రూపొందించాలని సంకల్పించాం. ప్రజల జీవన ప్రమాణాన్ని అభివృద్ధిచేయడం, పంచవర్ష ప్రణాళికలను అమలు చేయడం మొదలైన లక్ష్యాల నెన్నిటినో సాధించాలనుకొంటున్నాం. కోట్లాది ప్రజల అభివృద్ధికోసం కృషి చేయడంకన్నా అత్యధికోత్సాహాన్నిచ్చే మరో విషయం లేదు. ఇది ఉత్తేజంతో కూడినకృషి. ఐతే, స్వాతంత్ర్యోద్యమంలో మాదిరిగా, ఇప్పుడుకూడా కాంగ్రెసువారంతా కలిసి కట్టుగా, దేశంకోసం పాటుపడతారా అన్నది అనుమానంగా ఉంది" అని అఖలభారత కాంగ్రెసు సమావేశంలో మాట్లాడుతూ ప్రధాని నెహ్రూ అన్నారు.

(శ్రీ నెహ్రూ ప్రకటనలోని తొలి భాగాన్ని నిన్నటి పత్రికలోనే ప్రచురించాము—సం॥)

కాంగ్రెసును పునరుజ్జీవనం చేయాలనే తీర్మానంపై మాట్లాడుతూ శ్రీ నెహ్రూ ఇంకా ఇలా అన్నారు.

"కాంగ్రెసు వాదులలో క్రమశిక్షణ నశించింది. ఒక కోరిక, భవిష్యత్తులో ఏదో సాధించాలనే ఔత్సుక్యం గతంలో ఉండడంవల్ల కాంగ్రెసులో ఐకమత్యంఉండింది. స్వాతంత్ర్యం రావడంతో ఆ ఔత్సుక్యం పోవడం సహజమే. ఐతే ఇప్పుడు నూతన వాంఛలవల్ల సంస్థలో ఐకమత్యం ఏర్పడాలి. సామ్యవాద సమాజనిర్మాణం, పంచవర్ష ప్రణాళికలను అమలుచేయడం, ప్రజల జీవన ప్రమాణాల నభివృద్ధి చేయడం మొదలైన ఎన్నో లక్ష్యాలను సాధించాలని ఉద్దేశించాం. కోట్లాది ప్రజల అభివృద్ధికి కృషిచేయడంకన్నా మంలోపాలిశయాలను, ఉత్తేజాన్నీ ఇచ్చే మరో సంఘటన లేదు. ఐతే, ఇలా దేశాభివృద్ధికోసం క్రమశిక్షణలో, ఐకమత్యంగా కృషి చేయాలనే భావం కాంగ్రెసువాదులలో కలగడం అనుమానంగా నేఉంది. కుల మత రాష్ట్ర దురభిమానాలకు వ్యతిరేకులమని చెప్పుకొంటున్నాం. ఈ సంకుచిత దృక్పథాలవల్ల ఎంత హానికలిగిందీ అందరికీ తెలుసు. ఐతే వీటికన్నిటికీ మీరుగాని, నేనుగాని పూర్తిగా దూరంగా ఉన్నామా అనేది ప్రశ్న. ఈ దురభిమానాలు తలెత్తగానే సంస్థ పునాది కదలిపోయింది. సంస్థ పటిష్ఠం కావడానికి ఇప్పుడు తలపెట్టిన సవరణలు తోడ్పడతాయి. ఐతే ఒక్క రాజ్యాంగ సవరణలవల్ల అంతా జరిగిపోతుందనుకోకూడదు. అంతకన్నా ముఖ్యమైన విషయాలెన్నో ఉన్నాయి. అవి హృదయానికీ, ఆత్మకూ సంబంధించినవి. కాంగ్రెసులో ఇవి లేకపోతే, రాజ్యాంగం ఏమీ చేయలేదు. కాంగ్రెసు, ప్రభుత్వము, మంత్రులు సరిగా వ్యవహరించకుండా, దుబారా చేస్తూ, ప్రజలనుమాత్రం అధిక పన్నులు చెల్లించాలని ఎలా అడిగగలరు?"

### భాషా సమస్య

"భాష, రాష్ట్ర సమస్యల ప్రభావానికి మనం లోనయ్యాం. ఈ సమస్యలు కొంతవరకూ సమంజసంగానే ఉండవచ్చు. కాని ఈ సమస్యలను లేకత్తించిన విధానాలవల్ల ఈ సమస్యలు అభ్యుదయ నిరోధకంగాను, జాతీయ వ్యతిరేకంగాను రూపొందాయి. వీటి కన్నిటికీ ఎదురుగా నిలబడడానికి బదులు, మనం వీటి ప్రవాహానికి కొట్టుకుపోతున్నాం. మనకు మనం ఎన్నిక కావడానికి బదులు, కాంగ్రెసుతో సంబంధం లేని వారి సహాయాన్ని పొందాలని ప్రయత్నిస్తున్నాం. ఎన్నికలలో మనకు అలాంటి సహాయం రావచ్చునే కాని ప్రజలముందు ఎలా నిలబడిగలం?"

### ఫలితాలనుగురించకుండా తీర్మానాలు చేస్తున్నాం

"గాంధీజీ నాయకత్వంలో కాంగ్రెసంస్థ స్వాతంత్ర్యంకోసం పోరాడింది. విల్లులోని బాణం మాదిరిగా అలక్ష్యసాధనకు పోరాటం చేశాం. కాని ఇప్పుడలాంటి లక్ష్యం లేదు. స్వాతంత్ర్యంకోసం జరిపే పోరాటం మాదిరిగానే స్వాతంత్ర్యం తరువాత కూడా అందరూ ఒకే లక్ష్యంలో పని చేయాలనిలేదు. ఐతే సంస్థ ఐకమత్యం మాత్రం దెబ్బతినకూడదు. సంస్థకు ఒక లక్ష్యం ఉండాలి. ఇది మరీ సంకుచితంగా ఉండడానికి వీలులేదు. ఐతే కాంగ్రెసు చేసిన తీర్మానాలలో ఈ లక్ష్యాలు, ఉద్దేశాలు ఉన్నాయి. కాని దురదృష్టవశాత్తు ఫలితాలను గురించి ఆలోచించకుండా, మనం తీర్మానాలను ఎంతో నిర్లక్ష్యంగా అశ్రద్ధగా ఆమోదిస్తున్నాం. ఇదంతా ఇలా చెప్పడం మనోకరికి క్షమాపణ చెప్పకొనడంకొరకు. మనం ఆత్మపరిశోధన చేసికొనడం మాత్రమే. మీరూ అలాగే ఈ విషయాలను పరిశీలించి చేయవలసిన మహత్తర కార్యాలను చేబట్టాలి."

## ఎన్నికలకు ఎంతో శక్తి వృధా ఔతోంది

"ఎన్నికలకు ఎంతో శక్తీ, కాలమూ వృధాఔతున్నాయి. ఒకదాని తరువాత మరో ఎన్నికలో పాల్గొంటూనే ఉన్నాం. ఎన్నికలై పోయాయనుకొంటే, దరఖాస్తులు, ఎన్నిక విచారణ సంఘాలు ఉన్నాయి. ప్రజాస్వామ్య విధానం కోరేవాడినే నేను, కానిసంస్థను ఇంత ఇదిగా ప్రజాస్వామ్యం నలగగొడుతుందంటే, ఆ విధానంలో తప్పు ఉందన్నమాట. ఐతే ఎవ్వరిమీదా ప్రజాస్వామ్యం ఇది అని బలవంతంగా రుద్దలేము. మనం ఆ విధానానికి అనువుగా మారాలి. లేకపోతే, నీకు మరో ప్రజాస్వామ్య విధానం ఏర్పడుతుంది."

## జోర్డాన్‌నుండి బ్రిటిషు సేనల ఖాళీ

అమ్మాన్, మే 31: మధ్య ప్రాచ్యంలోని వైమానిక స్థావరాన్ని బ్రిటిషురాయబారి శ్రీ చార్లస్ జాన్‌స్టన్, జోర్డాన్‌రాజు హుస్సేనుకు అధీనంచేయడంతో, జోర్డాన్‌లోఉన్న ఆఖరు బ్రిటిషువైమానికదళం స్వదేశానికి బయలుదేరింది. బ్రిటిషు జండాను తీసివేసి, జోర్డాన్ జాతీయ జండాను, ఎగుర వేశారు.

తూర్పు, పశ్చిమాలలో ఎక్కడ నుండి వచ్చినా, సామ్రాజ్య వాదానికి తాను వ్యతిరేకినని జోర్డాన్ రాజు అన్నారు. మిత్రభావంతో మెలగే వారితో మైత్రిగా ఉంటామనీ, విరోధ భావంతో ఉన్నవారితో, తామూ అదేవిధంగా ఉండవలసి వస్తుందనీ అన్నారు. జోర్డాన్, అరబ్ రాజ్యాలలో అంతర్జాతీయ కుట్రలు లేవదీస్తోందని ఆయన ఆరోపించారు.

## మౌలానా భషానీ నిరాహారదీక్ష

### జీవితావసరవస్తువులధర తగ్గనందుకు

ఢక్కా, జూన్ 1: ఆహారధాన్యాలు తదితర జీవితావసర వస్తువుల ధరలు పెరిగి ప్రజలు యమయాతన అనుభవిస్తున్నందున, 'ఆత్మ పరిశుద్ధి కోసం' తూర్పు పాకిస్తాన్ అవామీ లీగ్ అధ్యక్షుడు మౌలానా భషానీ, ఇవాళ నిరాహారదీక్ష ప్రారంభించారు. ఈ దీక్ష వారం రోజులు సాగుతుంది.

శ్రీ భషానీ తనకు అతిథిగా ఉన్న అబు జాఫర్ షంషుద్దీన్ యింట్లో దీక్షప్రారంభించి, యీ సాయంత్రం వైద్యకళాశాల ఆసుపత్రిలో ఒక గదికి మకాం మార్చుతున్నారు.

రాష్ట్రప్రభుత్వము, వివిధ పార్టీల ప్రతినిధులు, అధికారులు, రాష్ట్రంలో ఆహారసమస్యను పరిష్కరించేందుకు ఎంతో ఆసక్తిచూపారని ఇది తనకు చాలావచ్చిందని, కేంద్ర ప్రభుత్వం కూడా సహకరించేట్లయితే ఆహారపరిస్థితి అదుపులోకి వస్తోందనే ఆశ పడుతున్నానని శ్రీ భషానీ పత్రికా విలేఖరులతో చెప్పారు.

## హిమాచల్ ప్రదేశ్ ఎన్నికలు

### ఫలితాలు తెలిసిన 13 లో కాంగ్రెస్‌కు 8 స్థానాలు

సిమ్లా మే 31: హిమాచల్ ప్రదేశ్ ప్రాంతీయసంఘం ఎన్నికలలో యిప్పటి మటుకు ఫలితాలు తెలిసిన 13 స్థానాలలో 8 మాత్రమే కాంగ్రెసుకు లభించాయి. మిగతా ఐదుస్థానాలు స్వతంత్రులు గెల్చుకొన్నారు. గెలిచిన కాంగ్రెసు అభ్యర్థులు కూడా, చాలా కొద్ది తేడాతోనే గెలిచినట్లు తెలిసింది.

హిమాచల్ ప్రదేశ్ నుంచి లోక్ సభకు 4 గురు, ప్రాంతీయ సంఘానికి 36 గురు ఎన్నిక కావాల్సి సింవుది. పోలింగు యింకా పూర్తికాలేదు.

## గుమ్ములూరులో దొమ్మీ

### ఇద్దరి మరణం ముగ్గురికి గాయాలు

ఆకివీడు, మే 30: గుమ్ములూరు గ్రామంలో మొన్న రెండువర్గాల మధ్య దొమ్మీ జరిగిఇద్దరుమరణించారు. ముగురికి బలమైన గాయాలు తగిలాయి. మరణించిన వారు బొమ్మ సత్యం, అల్లాడి వెంకటచలం గాయపడిన అల్లాడి గోపయ్య, అల్లాడి కన్నయ్య, సవరపు నరసయ్య, భీమవరం ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు.

సుమారు 15 మంది దారికాచి యీ ఐదుగురిని కొట్టారని తెలుస్తున్నది. పోలీసు అధికారులు దర్యాప్తు చేస్తున్నారు. (స్వ. వి.)

## ఒక్కొక్క అణుబాంబు పరీక్షవల్ల 50 వేల మంది మృతి

న్యూవెస్ట్ మినిస్టర్ జూన్ 1: ఒక్కొక్క అణువుబాంబుల పరీక్షవల్ల ప్రపంచంలో 50 వేల మంది మరణిస్తారని, ప్రపంచ ఆరోగ్యసంస్థ మాజీ అధిపతి డా॥ బ్రాక్ చిషోం, చెప్పారు.

అణువు బాంబు పరీక్షవల్ల కలిగే రేడియో ధార్మికశక్తి ప్రభావం వెంటనే కన్పించదని, యీ ధార్మిక శక్తివల్ల నెత్తురు విరగడం మామూలు అని డా॥ బ్రాక్ అన్నారు.

## బ్రిటన్ పరీక్షించిన ఉదజనిబాంబు

### అణురజోపాతం అట్టే ఉండదట

అలెక్స్ నొక్, జూన్ 1: బ్రిటన్ నిన్న ప్రేల్చిన పెద్ద ఉదజని బాంబువల్ల అణురజోపాతం చాలా తక్కువ ఉంటుందని విజ్ఞానశాస్త్ర విభాగం డైరక్టరు శ్రీ డబ్ల్యు. ఆర్. కుక్ అన్నారు.

మధ్య పసిఫిక్ మహాసముద్ర ప్రాంతం నుండి, వియత్తలానికి ఎగిరిన అగ్నిగోళం క్రమేణా కుంచించుకొని అతి సూక్ష్మమైన రజం అంతరిక్షంలోకి పోతుందని, ఈ రేణువులు భూమిమీద పడడానికి, కొన్ని నెలలు లేదా కొన్ని సంవత్సరాలు పట్టవచ్చునని ఇలా నెమ్మది నెమ్మదిగా పడేయారజం ఏ ప్రాంతంలోనూ దట్టంగా పడదని, శ్రీ కుక్ అన్నారు. భూమిపై పడడానికి చాలా వ్యవధి పడుతుంది గనుక, యీలోగా రేడియో ధార్మికశక్తి బాగా పలచబడి ప్రమాదంలేని స్థాయికి దిగుతుందని ఆయన అన్నారు.

## "దేశాభ్యుదయానికి మన కృషి ఎంత?"

### ఎవరికివారు విచారించుకోవాలని శ్రీ గిరి సలహా

మద్రాసు, జూన్ 1: "ఇతరులను విమర్శించడం సులభమేగాని దేశ ఆర్థికాభ్యుదయ సాధనకు ఎంతవరకు మనం చేయూతి యిచ్చామనే విషయమై ప్రతివారు కొంత ఆత్మ పరిశోధన చేసుకోవలసి ఉంటుందని" ఉత్తరప్రదేశ్ గవర్నరుగా నియమితులైన శ్రీ వి. వి. గిరి నిన్న సాయంత్రం నగర పత్రికా రచయితలు తమ గౌరవార్థం మైలాపూరు ఉడ్ లాండ్సులో ఏర్పాటు చేసిన సన్మానసభలో కేంద్రప్రభుత్వపు కొత్తపన్నుల విషయమై జరిగిన విమర్శలగురించి అన్నారు.

ఈ సభకు పలువురు పత్రికా రచయితలతోపాటు, సర్ ముత్తా వెంకట సుబ్బరావు మద్రాసు హైకోర్టు మాజీ న్యాయమూర్తి, ఆర్థికమంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యంకూడా హాజరైనారు.

శ్రీ గిరి అభినందనలకు కృతజ్ఞతను తెలుపుతూ దేశంలో జనసామాన్యానికి తినటానికి మూడు పూటల భోజనము, కట్టుకోటానికి మంచి దుస్తులు, ఉండటానికి గృహము, చేతూర్చాలనే లక్ష్యసాధనకు మనం ఎంతవరకు సహాయ పడ్డామనే విషయం గురించి ప్రతివారు కొంత ఆలోచన చేయాలన్నారు. దేశాభ్యుదయం నిమిత్తం అమలు జరగాల్సిన పంచవర్ష ప్రణాళికల నిర్వహణకు సహాయపడటానికి ప్రజలందరూ త్యాగం చేయాలనీ యిదివరకు త్యాగంచేసిన వారు సహా యింకా త్యాగం చేసేందుకు ముందుకురావాలనీ అన్నారు.

గవర్నర్ల గృహ నిర్వహణలో దుబారా తొలగించి, పొదుపుగా వ్యవహరించాలనే సూచన గురించి ప్రస్తావిస్తూ అట్టి సూచన సమంజసమైనదే అనిన్నీ తను జనసామాన్యంలోని వాడే అయినందున తాము ఆ విధంగా చేయటానికి తప్పక పూనుకోగలమని శ్రీ గిరి అన్నారు. గొప్పపదవులు రావాలని తానెప్పుడూ తాపత్రయ పడలేదని, అట్టి పదవులు తనకు అదృష్టవశాత్తు వచ్చినపుడు సహా తనకు న్యాయమని తోచినట్లుగా వ్యవహరించటానికి తాను జంకడం లేదని కూడా అన్నారు.

పత్రికా రచయితలతో తమ సంబంధాలు ఎప్పుడూ అన్యోన్యముగా ఉంటూ వచ్చిందనీ వారు ఎప్పటివలె నిర్మాణాత్మకమైన సలహాలను అవసరమైనపుడల్లా యిస్తూ ఉంటారని ఆశిస్తున్నామని శ్రీ గిరి అన్నారు.

ప్రారంభంలో సమావేశకర్త శ్రీ వి. యన్. కాళిదాస్ శ్రీ గిరికి స్వాగతమిస్తూ ఆయన నీతి నియమాలను ఎన్నటికీ విడనాడినవారు కారనీ, పత్రికల వారితో మైత్రి కలిగి ఉండేవారని అన్నారు. శ్రీ గిరి గారు గవర్నరు ఉద్యోగకాలం పూర్తిచేసిమంత్రిపదవిని మళ్ళీ వహించగలరని ఆశిస్తున్నామని ఆయన అన్నారు.

శ్రీ ఖాసా సుబ్బరావు మాట్లాడుతూ శ్రీ గిరి మంచి నీతి సూత్రములు కలవారైనందున గవర్నరు పదవీ నిర్వహణయందు మిత వ్యయాన్ని సాధించి పొదుపుగా వ్యవహరిస్తూ యితర గవర్నర్లకు ఆదర్శప్రాయం కావటానికి తగినవారుగా ఉన్నారని అభినందించారు.

డా॥ జి. సీతాపతి, శ్రీ శాలి ధర్మారావు కూడా శ్రీ గిరికి నూతన పదవిలో విజయం చేకూరగలదని ఆశిస్తున్నామన్నారు.

శ్రీ కాళిదాస్ ధన్యవాదాలు సమర్పించారు.

## భారత పోలీసు అరెస్టు

### పోర్చుగీసు అధికార్ల దుష్ప్రవర్తన

న్యూఢిల్లీ, జూన్ 1: భారతభూభాగంలోనే భారతపోలీసు కానిస్టేబిల్ను గోవాలోని పోర్చుగీసు అధికారులు అరెస్టుచేసినట్లు యిక్కడికి వార్త అందింది.

విఠల్ రహ్మాన్ అనే యీ భారత కానిస్టేబిల్ను భారత పోర్చుగీసు సరిహద్దున కాపలా ఉంచారు. ఈయన క్రితం మంగళవారంనాడు నీళ్లు తెచ్చుకొందామని వెడుతుండగా, పోర్చుగీసు సైన్యంలోని శ్వేతఅధికారులు, భారత భాగంపైకి దురాక్రమణగా వచ్చి ఆ కానిస్టేబిల్ను అరెస్టుచేసి, పోర్చుగీసు ప్రాంతంలోకి ఈడ్చుకొని పోయారట.

ఈ సంఘటన చాలా తీవ్రమైనదని భారతప్రభుత్వంభావిస్తోందనిఢిల్లీలోని బ్రెజిల్ రాయబారిద్వారా అధిక్షేపణ పంప నిశ్చయించిందని అధికార రీత్యా తెలుస్తున్నది.

### చర్మరోగాలుగురించి ఉచిత వైద్యసలహా

మదరాసు, జూన్ 1: గాంధీ కుష్ఠ రోగ నివారణ సంస్థకు చెందిన శ్రీ పి. విశ్వనాథశర్మ జూన్ 3, 4 తేదీలలో సా 4 నుంచి 6 గం మధ్య అడయారు గాంధీనగరు 2 వ మెయిన్‌రోడు నెం. 50 ఆరోగ్యాశ్రమంలో అర్హతగలవారికి పేదలకు చర్మరోగాలు గురించి ఉచిత వైద్యసలహా యిస్తారు.



Printed and Published for Nageswara Rao Estates (private) Ltd, by S. Radha Krishna, at The Andhra Patrika Press, No. 6 & 7 Thambu Chetty St., Madras-1. Editor S. Sambhu Prasad.